Reg No M 757.

శ్రీ

# అభినవ సరస్వతి.

యనునొక మాసపత్రిక.

అష్టావధాని, జానపాటి పట్టాభిరామశాస్త్రిచేఁ

ప్రచురింపఁబడుచున్నది.

గుంటూరుజిల్లా, పల్నాఁడుతాలూకా, జానపాడు.

సంపు 3.] 1911సం॥ జూలై నెల. [సంచిక 7.

విషయములు.



చందానిర్ణయము సంవత్సరమునకు.

| | | | |
|---|---|---|---|
| ప్రధానపోషకులకు | రు 25-0-0 | సహాయులకు | రు 5-0-0 |
| పోషకులకు | రు 10-0-0 | చందాదారులకు | రు 2-0 0 |


భారతీవిలాస ముద్రాక్షరశాల, నర్సారావుపేట.

Printed at the Bharathi Vilasa Press,
Narasarowpet And published at Janapadu,
by the Editor Astavadhani
Janapati Pattabhirama Sastry.

1911

ఈసంవత్సరము చందాయిచ్చిన—

## స హా యు లు.

1 తంగెడ నరసింహారావుగారు, కరణం, మోర్జంపాడు.

2 పిర్రాట్ల సీతాకాంతంగారు, చింతపల్లి.

3 పిర్రాట్ల సత్యనారాయణగారు, చింతపల్లి.

4 కొప్పరాజుగురుచంద్రశేఖరరావుగారు, ఫారెస్టుగార్డు, మేళ్ళవాగు.

5 కంచర్ల లక్ష్మయ్యగారు, ఫారెస్టుగార్డు వంపయ్యపాలెం.

6 వుప్పలపాటి వెంకటసుబ్బయ్యగారు, కరణం వుప్పలపాడు.

7 వెలుగూరి పిచ్చయ్యగారు, పెదకొదమగుండ్ల.

8 గోరంట్ల పున్నయ్యగారు, వుప్పలపాడు

ఇవ్వవలసినవారు—

9 సూరిదేవర సుబ్బానాయుఁడుగారు, తుమ్మపూడి.

10 తుమురుగోటి నరసింహారావుగారు, తిరుమలగిరి.

11 తడిసిన రామధర్మారెడ్డి దేశముఖుగారు కొమ్యాడ.

12 కాకుమాను హనుమయ్యగారు, నర్సారావుపేట.

13 రాజశేఖరుని లక్ష్మినారాయణగారు, కరణం, చిట్యాల.

14 గోపాలుని రామలింగయ్యగారు, ముప్పాళ్ళ.

15 ఘడియారం వెంకటశివశాస్త్రిగారు, సంగంజాగర్లమూడి.

16 బూదరాజు వెంకటసుబ్బయ్యగారు, కరణం, స్వర్ణ.

17 ఏలేశ్వరం వెంకటసుబ్బారావుగారు, వకీలు, సిద్దిపేట.

18 కలవలపల్లి రంగయ్యశాస్త్రిగారు, భాస్కరాచార్యులు, యేలూరు

19 మంచిళ్ళ నారాయణరావుగారు, కంభంపాడు.

20 గుజ్జాల వెంకటరెడ్డి దేశముఖుగారు, గుండవరం.

21 గంభీరరావు దేశాయిగారు, లింగన్నపేట.

22 సైదుఖాసింసాహెబుగారు, ఫారెస్టుగార్డు, చింతపల్లి.

23 మెదకు శేషారావు దేశముఖుగారు, నల్లబల్లి.

24 చింతలచెరువు గోవిందరెడ్డిగారు, గ్రామమునసబ్ చంద్రాజుపాలెం

శ్రీమత్

# అభినవ సరస్వతి.

ఇది మాసమునకొకసారి ప్రచురింపఁబడును.

---:0:---

## కృతి విమర్శనము.

ఆబ్దికమంత్రము—ఇందాబ్దికమంత్రమంతయు సస్వరముగ నర్థసహితముగ నున్నది. శ్రాద్ధీయద్రవ్యములును శ్రాద్ధనియమములును దఱచు చెప్పఁబడి వాని ప్రమాణములును జూపింపఁబడి యున్నవి. మనవారు శబ్దజ్ఞానశూన్యులై శ్రాద్ధముల యందపశబ్దముల ననంతములుగా నుచ్చరించుచు విద్వాంసుల వీనులకు వెగటుగలుగఁ జేయుచున్న యీకాలమున నీగ్రంథము మహోపకారియై చూపట్టెను. ఏతత్సంపాదకులగు శ్రీ కోటీశ్వరశర్మశాస్త్రిగారిచే నీగ్రంథము దయచేయఁబడి యభినవసరస్వతీ కార్యస్థాన మలంకరించినది. దీనివెల రు0-12-0 వలయువారు మదరాసు చింతాద్రిపేటలో స్వధర్మప్రకాసిని మేనేజరుగారికి వ్రాసికొనవలెను.

కవిమిత్రము—ఇందు అరసున్నలుగలశబ్దములును శకటరేఫలుగలశబ్దములును నన్నియుఁ గ్రోడీకరించి యకారాదిగాఁ జేర్పఁబడి యున్నవి. ఆంధ్రభాషలో వివిధశబ్ద విలేఖకులగు విద్యార్థులకుఁగాని కవులకుఁగాని యర్ధానుస్వార శకటరేఫలరచేతిలోని యామలకములవలె నిందుఁగనుపడును. ఇందువనే దీనినామము సార్థకకమై యున్నయది.

రుక్మాంగదనాటకము—ఇది లలితపదభూయిష్టమును రసవంతమును ప్రసిద్ధిదేశీయ పదప్రచురమును నై ప్రకరణానుసారముగ

నాయకాస్థలముల హాస్యరసముచేఁ గూడ నానందమును జేయుచున్నయది. ఇందలి ముఖ్యవిషయ మేకాదశీ మాహాత్మ్యము. నీతులు కుప్పతెప్పలు కొన్నికొన్ని పద్యములు చదువుపట్ల కొట్టవచ్చినట్లయుండెడిని. గ్రంథ విస్తరభీతిని మిక్కిలి వ్రాయఁజాలఁగాని గ్రంథము చాలఁ బ్రౌఢమైనది. ఈ రెండు గ్రంథములును గ్రంథకర్తయగు జేతపూడి భగవంతరావుగారికి బెజవాడ వ్రాసిన దొరుకును.

విచిత్ర బిల్హణనాటకము—ఇది కఠినపాకముగాక మృదుమధురవచన రచనగలదియై చదువరుల మనంబుల సంతోషపెట్టుచున్నది. గ్రంథకర్త మహమ్మదీయుఁడై యాంధ్రభాషలో నింతపాటి గ్రంథము రచించుట గొప్పవిషయము. ఇందులో లోకోపకారములైన స్త్రీవిద్య యతిబాల్యవివాహ నిషేధము మున్నగు నీతులు పెక్కులు చేర్పఁబడి యున్నవి. గ్రంథకర్తయగు వుమేరలీషా గారిచేఁ బనుపఁబడి మాకార్యస్థానమలంకరించినది. వెలరు0-8-0 వలయువారు బైసాని సుబ్బయ్య రాజమండ్రి అని వ్రాయవలెను.

వసంతవిలాసభాణము—ఇది దశరూపకములలో నొకరూపకము. శ్లో॥ 'విటస్యైకాహికం వృత్తం భాణ ఇత్యభిధీయతే'' అనురీతి విటునియొక నాఁటి వృత్తమం దిముడ్పఁబడినది. కవిత్వము సరసమును, నిర్దుష్టమును, ఇందనేక వర్ణనములు స్వభావోక్తులై చాలరమ్యములుగా నున్నవి. గ్రంథకర్తలగు దేవులపల్లి వెంకటనృసింహశాస్త్రిగారిచేఁ బనుపఁబడినది. దీని వెల రు0-4-0లు మండపేట.

మహమ్మదీయ మహాయుగము—ఇందు పూర్వపు మహమ్మదీయరాజులయొక్కయు నారాజులకు సమకాలికులగు కృష్ణదేవరాయలు మున్నగు నితరప్రభువులయొక్కయుఁ జరిత్రలు విపులములుగా నున్నవి. ఇందలివిశేష మిదివఱకే యనేక పత్రికాధిపతులు తెలిపియుండిరి. కావున నేను వేఱె తెలుపననవసరము. ఈగ్రంథముచే విజ్ఞానచంద్రికా గ్రంథమండలివారు మాకార్యస్థాన మలంకరింపఁజేసిరి. వెల రు1-8-0లు.

# సోదరకవులు.

—:O:—

సుకవిత్వాభిమానులారా !

కొప్పరపు కవీశులు మార్గస్థపురంబున 22—2—11వ తేదీన గంటావలంబి ఘంటానినాదసూచ్యమాన స్వాగతులగుచు స్వాగతసభ నలంకరించినాఁటిదినంబునఁ గుచేలోపాఖ్యాన కథను గంటకు 300 పద్యముల లెక్కను 20 నిమిషములు మాత్రము చెప్పిరి. అందులోఁ దమ చెన్నపట్నపు సన్మానమును గుఱించిన పద్యములు కూడ చేర్పఁబడినవి-అప్పుడు వీరిపద్యముల నెన్నువార లనేకులుండినను ముగ్గురికి మాత్రము మూఁడువిధములుగ లెక్క తేలినది ఒకరికి 35 ఒకరికి 94 మఱియొకరికి 100 ఎట్లైన గంటకు మూఁడునూరు చెప్పెదువా రనిపించుకొనిరి. వీరి కవిత్వము కొంచెము గొప్ప హరికథలలోని తోహరాను బోలియుండును. కావుననే ప్రతిపద్యమునకుఁ [illegible] "సంపన్నరేభ్యులార ! ఆర్యసభ్యులార !" అని కాని "ధన్యగుణులార ! సరససత్కవులార !" అని కాని వీరు చెప్పుచునే వచ్చిరి. వీనిని మినహాయించినచో గంటకు 225 పద్యములు మాత్రమే యాశువుగ నల్లఁబడినవియై యుండును. ఆ 225 పద్యములయందే యెన్నివృత్తములు యతిభంగాది దోషవిశిష్టములై యుండునో యవి తత్కాలికములనుట కించుకయైన సందియములేదు. నిర్దుష్టములగు వృత్తములు నూటికి 45 కి పైగా వర్ణించిన పదములై యుండు నని రెండుమూఁడుసారులు వీరి యాశుకవితను విని యేమాత్రమైన ధారణగల్గు ప్రతిబాలునకును దోఁచకపోదు. దీనికి దార్ఢ్యముగ "సరసిజవైరివైరి నెకసక్కెములాడెడుమధ్యముంబుతో, సరసిజవైరివైరి నగఁ జాలెడుమేలగు కప్పుకొప్పుతో, సరసిజవైరివైరులపసందుల దూఁగుచుఁ గుచద్వయంబుతో, సరసిజగంధి వచ్చెనలు సన్నిధికిన్ మదనాశుగంబనన్" అను పద్యము మున్నగు కొన్ని పద్యములు పట్నములో నలచరిత్ర యాశుధారగఁ జెప్పినపుడు చదివితిమని మా గురువుగారికి వినిపించిరి. ఆ పై పద్యములనే గుంటూరిలో జరిగిన రెండవసభలో సావిత్ర్యుపాఖ్యానములో "నలుసన్నిధికిన్" అనుచోట "నృపుసన్నిధికిన్" అని మార్చి చదివిరి. ఇటులనే "నిష్కపటస్వభావమున" ఇత్యాద్యనేకపద్యములు శ్రుతపూర్వములే వినవచ్చెను- వీరికుచేలోపాఖ్యానసభనాఁడు కవిత్వావధానాదులయందుఁ బ్రవేశములుగల యొకరిద్దఱు విద్వాంసులు మాత్రమే విచ్చేసియుండిరి అప్పటి వీరిపద్యములలోని యతిభ్రంశాదులను సన్యాసపూర్వకపద్యములను దదీయపురాతన పద్యములను విని వీరి యాశుకవితను గ్రహించి యట్టిసభలు గుంటూరులో మఱిరెం

డు జరిగినను వానికిఁ బైవిద్వాంసులు రారైరి. వీరికి సన్మానమొసఁగుతఱి వీరియవధానపాటవాదులనుబండితకవిమండలి మొదలనేకనఁబఱచిపండితకవులచేతనే వీరికిఁబతకములనిప్పించునటుల వీరి సహకారులు ప్రపంచము చేసిరి కాని యట్లు జరుగకపోఁగా నా సన్మానసభకగ్రాసనాధిపత్యమొనర్చినవారితో "అగ్రాసనాధిపా! తమరు మఱియొకరికి నీదినమున సభలోమాట్లాడుట కవకాశమీయఁగూడ" దనివిన్నవించుకొనిరి. దీనింబట్టియే ప్రథమసభకుదక్క మఱిదేనికి నాప్రశంసగల సంస్కారులు రారైరి. "ఎవరికేని సామాన్యముగ మాట్లాడునపుడే తొంబదితొమ్మిదితప్పులు దొరలుచుండఁబద్యములలోఁ దప్పులుపడకయుండునా? విద్వత్కవులాలోపమును క్షమింతురుగాక" యని యీకవిపుంగవులు ప్రథమసభయందుఁ బాహ్యరూపముగఁ బండితకవిమండలికి నతులొనర్చి తమ శమదమాది గుణసంపత్తిని తమ యనాగ్రహాతిసంస్కృతగంభీరత్వమును బహుముఖములఁ బ్రకటించుకొనియేయున్నారు. ఆప్రకటన ననుసరించి వీరన్యదీయములను స్వీయపురాతన పద్యములను జదువక నియమించిన కాలమంతయు నాశుకవితచేతనే కడపినచో నిజముగగంటకెన్నిపద్యములు తేలునో లెక్కించి చూచునంతటిభాగ్యము మాకబ్బదయ్యె. వీరుపండితమండలి నెఱుఁగుట స్వాహంకార ఖండన మొనరించుకొనునట్టి సత్స్వభావము గలవారైనను పండితకవిమండలిలేని సభలలోఁ దామేవిద్వత్కవివరేణ్యులమనియర్థమిచ్చు వాగాడంబరముచే స్వాహంకారమండనమొనర్చుకొందురు. అప్పటికి వారేవిద్వత్కవివరులగుటచే నది యొకలోపము కాదు. మొత్తముమీఁదఁ బైపొల్లులుపోను వీరి యాశుధారలో గంటకునిష్కృష్టములగునూఱుపద్యములు తేలవచ్చును- ఇట్టి వీరి యాశుకవితకుఁ గవి సార్వభౌమ బిరుదము నిచ్చునట్లు గర్తపురంబునఁ గొందఱభిప్రాయపడిరనియు శ్రీనాథునికిఁదక్క మఱియొకరికిం దగునా యని తొల్లిటియుద్దేశమును మగుడమానిరనియు వినికిడి. ఈ మెట్టగుంటూరు మండలమునకు నీదినమ్ములంగూడఁ గవిసార్వభౌమాలంకృతత్వ మబ్బియున్నచో నెంతప్రతిష్ఠావహమైయుండునో? సహృదయులారా! గంటకు మున్నూరుపద్యములనే చెప్పనక్కఱలేదు. నూఱుపద్యములను నిర్దుష్టముగఁ జెప్పియవధానముఖముల మగుడఁజదివినవారె యీకాలమునకుఁ గవిసార్వభౌములనఁదగుదురు. కావున సరసవిద్వత్కవివరేణ్యులకవిచ్ఛిన్నమును నిర్దుష్టమును దాత్కాలికమును నగు పద్యధారయే యాశుధారగాని పలుతెఱఁగులఁ బాదనియమము లేని తోడుపదముకొనఁదాక పెట్టుకొని గంటకిన్నియన్నియను లెక్కతో నవసరములేదని నాయభిప్రాయము.

ఇట్లు
ఆచార్య శిష్యుఁడు.

చున్న రాజవర్ణన మేమి! పురవర్ణనమేమి! స్త్రీవర్ణనమేమి! యంతవఱకున్న రచించి యుంచికొనఁగూడదా! కూడునో కూడదో తెలియుటకై కొన్నింటి నుదాహరించు చున్నాఁడను.

"క॥ జారులు చోరులు దుష్టా । చారులు దుర్మార్గ చరులు, చపలులు, విద్యా, । దూరులు నవినీతులు రణ। భీరులు లేరీ తఁడేలు పృథ్వీస్థలిలోన్ ॥

ఈయాతఁ డేలు పృథ్వీస్థలి, సామెతలోని (మంగలివాని) యద్దమువలె నెవ్వని కేనియుఁబనికి రాదా! ఇట్టే సర్వనామ ఘటితంబుగ నష్టాదశ వర్ణనలును జేసికొని యున్న వానికి నిఁకఁ జేరొకటియుం దతుకుటతప్పుఁ గష్టమేముండునో! విచారింపుఁడు కావునఁ గథావిషయకములైనచో నిది క్రమమని నమ్మఁదగదనియు భిన్నవిషయకభిన్న వృత్తుకములై నంగాని లేక యేకవిషయకముగాని యైనచో నసమ్మతమనియుఁ జాటుచున్నారము, వీరికీతికి నొప్పరని యీపంక్తులు చెప్పుచున్నవి.

"ఒకవస్తువును నూఱుపద్యములచే వర్ణింపుమని కాని యాకథలో నీవర్ణన మెక్కువగా నుండవలెనని గాని చెప్పరాదు. ఈవృత్తములఁ జెప్పవలెనని నియమింపరాదు"

మధ్య మధ్య చెప్పినచోఁ గష్టముగా నుండును గాని యితివృత్తము నేర్వ అమునప్పుడే యీవర్ణన మంత యుండఁదగునని చెప్పినచో గ్రంథకర్త నిజముగ శక్తి యున్నవాఁడైనచో నష్టమేమో మాకుఁదోఁచకున్నయది. మాఱుమూల వృత్తములు గోరినచోఁ జిక్కుగాని సుమారుగా నిందుఁ గొన్ని వృత్తములు పృచ్ఛకులు చిన్నవిగాఁ జూచి మొదటనే కోరుటగాని తలఁచుగాఁ గాక యప్పుడప్పుడు «ఇటఁజంపకమాల చెప్పుఁడు, ఇట నుత్సాహ చెప్పుఁడు» అని కోరినంతలోఁ జిక్కేమి! అట్టి కట్టులకు లోఁగి చెప్పినఁ గదా! బిరుదున కర్హులగుట! లేనిచో గారడీయగును, కావున నేవీరు-

"గారడీ। చూపితి మెల్లవారలును జోద్యము నందనృపాల నందనా" (24 వ పుట.)

అని చెప్పియున్నారు. కాని యది యష్టావధానప్రసక్తిలోఁ జెప్పిరి. ఇటఁ జెప్పినచో టక్కున సరిపోవును. అష్టావధానమును «గారడీ» యనుటకు వీలేలేదు. దీనికే యదిసిద్ధించును. వీరియవిధానమునకుఁ బడు కష్టమునునది తాముచెప్పికొన్న పద్యములు కంఠపాఠము చేసికొని సమయమునకు వదలు చుండుట మాత్రము, ఎక్కడనేని

యొకటి రెండు చెప్పవలసివచ్చినను దుష్కరముకాదు, కావున నీయవిధాన మెంతవరకు సత్యమో ప్రాజ్ఞులూహింతురుగాక, పృచ్ఛకుల స్వాతంత్ర్యమును బూర్తిగా హరించుటచే వీరి యత్యద్భుతము గూడనిట్టిదియే కావలెను, ఏమయినను నది యింతగాఁ గడికాదు, దానికున్న లోపములు పెక్కెన్నియొకజాతివి. ముఖ్యలోపము, కంద గౌరునోమును గీతగోవింద పారాయణమును ధారణాభావమును వర్ణవ్యత్యాసమును నని మున్నుచూపఁబడియే యున్నది. కానిండు; ఘంటాశతమును గూర్చివీరు పీఠికలో వ్రాసిన పంక్తులు వానికొన్ని చూపెదము,

> "మఱుసటిదినమున నాకాశపురాణమైన- జేయుదుమని విన్నవించితిమి, ప్రైవేటు సెక్రటరీగారు శ్రీ వారిబాబును జదువునపుడు "గంటకు నూఱుపద్యములు చెప్పిన విన దలంపు గలదన్నియుండునన్నది- మేమొప్పుకొను నిట్లుచేయుటకై కలలోను [illegible] ప్రయత్నించి యుండ లేదు"

అని యేమోసోదె వ్రాసిరి, కలలోఁ బ్రయత్నింపని మాట నిజమే కావచ్చును, [illegible] లోఁ బ్రయత్నించిరని ప్రమాణముగాఁ జెప్పనొప్పగు, ఇందు లక్ష్య[illegible]జనములోని-

(1) "శతమొక గంటలో నలు పంజాలుదు" (3 వ పుట)

(2) "విమత భయంకరంబగు నవీన విధానము చిత్తగింతురో" (5 వ పుట)

అను పద్యపాదద్వయము బాధింపదా! ఇవి వీరు మొట్ట మొదట శ్రీవారి సన్నిధిఁ జేసిన ప్రతిజ్ఞలుకదా! అంతకుమున్ను చేసి చూడక కొనకుండ నెట్లు ప్రతిజ్ఞ సేయుదురు! ఇంట గెలిచికదా రచ్చను గెల్చుట, రాజానురంజనము పూర్వమా! విధానరచన పూర్వమా! ఓ బాలకవి భ్రాతలారా! మీయంతస్సార మెల్ల నీపీఠికయే చెప్పచున్నది. మీకును మీపీఠికకును బది నేల వందనములు, ఎంత విమర్శించినను గఱప నేల తేఁకలి పాండరకలెనున్నది విసువెక్కుచున్నది. సత్యము తేల్పకతప్పకవచ్చినది, గాన శ్రమను సహించి విమర్శకిప్పు డుపకారార్థముగాఁ జూపించినను బరిణామ సుసుఖకరంబగు నీవిమర్శనమునకుఁ బూనితిని, ఇంకాదరము గలిగి చదువుకొని శ్రేయమునందుదురుగాక, వృథా ఖండన ప్రయత్నములో నశ్వరపడకుడు. మనమందఱమును సోదరులము, కలసినచో

హేతువు చెప్పఁగలను, ఇఁకముందు మీకవనములోఁ దప్పులంతగా నుండవు, కనుక నది పూర్వజన్మ పుణ్యవశమునం గాని కలుగదు. ఇంతకన్న నాయొనర్చు నుపకారము లేదు ఇఁక మీరీయవిధాన ముద్రణమునకై వ్రాసిన పంక్తులలోని (" మాతామేషంధ్యా ") వాక్యములను జూపి విమర్శింపఁబడుఁగాక,

అయ్యా!

(1) "ఒక లేకరియైనను బూర్తిగా వ్రాయకుండుట దీని నచ్చొత్తింప మని శతావధాన పీఠికలో వ్రాసియున్నారము"
(27 వ పుట)

ఈ పంక్తులు తాము వ్రాసినవేకాదు! శతావధాన పీఠికలో నేమని వ్రాసియున్నారో చూతము,

(2) "తత్కాల మందా పద్యములు వ్రాయుట కైనముద్రు లేకరులు యత్నించిరిగాని యొక్క పద్యమునైనఁ బూర్తిఁ జేయుశక్య మైనదికాదు. కొందఱు సంఖ్యను గూడఁ దప్పిరనుట యతిశయోక్తిగా నుండునేమో, అని యంతగా వ్రాయఁదలంపు లేదు" (2 వ పుట)

ఇవియును తమ వాక్యములేకాదు! ఈముందు పంక్తులు తిలకింపుఁడు.

(3) "కాని బ్రహ్మశ్రీ॥ ఆకొండి వ్యాసమూర్తి శాస్త్రిగారు (రాజమండ్రి ఆర్ట్సుకాలేజీ సీనియర్ పండిట్) యును ముద్రు లేకరులు వ్రాసిన పత్రికలం జూచి పద్యము వ్రాయుచు వారందఱు వదలిన చోటఁ గ్రొత్తగాఁ బూరించి బ్రాకెట్టులలో నుంచి యచ్చొత్తింపవలసిన దనియు, నట్లచ్చొత్తింపమిఁ గొందఱు (అప్పటి సభలో లేనివారు) యతిప్రాసము లుండవనియు ఛందస్సుపోవు ననియుఁ దప్పులుండు ననియు భ్రమముఁ జెందవచ్చు ననియు సెలవిచ్చిరి"

(27 వ పుట)

పై వాక్యములును తాము వ్రాసినవేకదా! ఈ వాక్యమును జక్కఁగాఁ జూచి

(1) వ వాక్యమునకును దీనికిని నెట్టి విరోధము వచ్చుచున్నదో చిత్తగింపుఁడు.-

(4) "మేమును వారి యాలోచనమున కొంతయు సంతసించుచు వ్రాయఁబూనఁ జాలవఱకిప్పటి పద్యములేయుండెను"

అయ్యా (1) లో నొక్క పద్యమైనను లేకరులవఁ బూర్తిఁ జేయశక్యము కాలేదుగదా? మీరు శ్రీ శాస్త్రులవారి యాలోచనమున కొంతయు సంతసించు నప్పటికిఁ జాలవఱకా పద్యములేయుండు టెట్లు! ఇక్కడ తాము వంచకులని తేలుటలేదా! ఇట తమ "మాయిమఱపింప వంచకులు" అను మదాలసపద్యమును జదివి కొనుఁడు మోసము గౌరవప్రదము కాదుగాని దానిజేయువానికి లోకాతీతమైన తెలివియుండవలెను! మొదట నొకటియుఁ బూర్తిగా వ్రాయఁబడని పద్యములు బ్రహ్మశ్రీగారి యాలోచనమున కొంతయు సంతసించుచు వ్రాయఁబోవు నప్పటికి నేవోకొన్ని, అనగా 8, 9, 10, 11, 12, 16, 17, 21, 22, 23, 30, 32, 43, 45, 63, 79, 82, 85, నెంబర్లు దప్ప మీకెట్లు పూర్తిగాఁ బ్రత్యక్షమైనవి. ఈ పదునెనిమిది మాత్రమింక బ్రాకెట్టున కవకాశమిచ్చినవి కాని తక్కినవి బ్రాకెట్టునకు లోఁగకయే ప్రత్యక్షమయినవే! ఇది కూటసాక్ష్యమువలెనున్నదని తమ వ్రాఁతచెప్పుటలేదా! అవసరమున్ బట్టి తామేదని వ్రాసికొందురుగాక, ఈవిరుద్ధోక్తిలోనికి బ్రహ్మశ్రీగారిని గూడ నెందులకవతరింపఁ జేసితిరి! ఈపంక్తులను వ్రాసి మీరు వారికిఁ జూపినచో దిద్దుదురు. అట్లు చూపుటయును సర్వజ్ఞత్వ భంజకమని తాము చూపలేదని నానమ్మకము. మఱియు మీకవితాపత్రిక, 1, 2, సంచికలలో వారుప్రకటించి నట్టున్న సుభాషితములు (ఎవరినో నిందించుటయే ముఖ్యోద్దేశము కలవి) కూడ బ్రహ్మశ్రీ గారెఱిఁగినచో మొట్టమొదట నుండియు "నీగోలయెందుల" కని మందలింతురనియే నానమ్మకము, పోనిండు మీపుణ్యమునఁగాక వ్యాసకర్తృత్వ మవ్వారికి లభింపజేయనందుల కింతయు సంతసింప వలసియున్నది. ఇప్పుడును బ్రహ్మశ్రీ గారు వెలయిచ్చిన భ్రాంతి లోకమున కునివర్తింపలేదు, ఈపద్యములు (అచ్చొత్తించినవి) వేఱు వీరుసభలోఁ జెప్పినవి వేఱు అను సంశయమును మీపీఠికావాక్యములు పూర్తిగా బలపఱచుచున్నవి. వీనిసమన్వయమునకు దేవుఁడవతరింపవలెను, ఇఁకఁ దాము శత సంఖ్యను ముడిపెట్టి సరిపెట్టిన విధముఁ జూపఁబడును, ఇందు (శతవిధానమున) (11) వచనములు గలవు వానిలో నొకటితుదనుండు గద్యము, ప్రహ్లాదవంశమున నీగద్యతోఁగూడ (99) గనుకనై (11) ను నొక పంక్తియు నర పంక్తియుఁ గలవచనములగుటచేఁ దీసివేయుట యుక్తము, ఇఁక (88) మిగులును అందుఁ బీఠికలోనివి (అంతవఱకే చెప్పినను జెప్పవల నగునవి) (13) ను త్రోసివేయ నిఁక (75) మిగులును ఈ (75) లో మున్ను చూపిన తెఱఁగున

నష్టాదశవర్ణనలు చేసి యుంచికొను పద్ధతిని గలిసివచ్చిన వెన్నియో, యుంచుకమూర్పు కలనఁ గలిసివచ్చినవెన్నియో, చూపవలసినవే కాని గ్రంథ విస్తరభీతిచే నాయంశమును లోకమునకే వదలుచున్నాఁడను, తుదకు (10) (11) పద్యములకన్న మీరాతువులోఁ దర్శాలమునఁ జెప్పినవి యుండవని భ్రమపడుచుట కడుసుకరమే కాని అందులకథనము (45) ఘోరములుచెత్తెంచివ్రాయవలెను, నైఁజూపిన పీఠికావాక్యములు "కాగితములమీఁద గంటముతో వ్రాలుచేసితిననియుఁ దాటాకుమైఁ గంటముచే వ్రాలుచేసితిననియుఁ జెప్పు కూటసాక్షివాక్యములవలెనున్న వో లేదో గ్రంథకర్తలే విమర్శించుకొందురు గాక, పీఠిక వ్రాసినంగాని విమర్శింపరాదఁట! పీఠిక వ్రాసినపిదపనిది యిట్లుండు నుండవలెనో; శుద్ధపత్రిక వేసిన పిమ్మటఁగాని విమర్శింపరాదఁట! దీనికి శుద్ధపత్రమునుంగలదుగా! ఈవిషయమున విస్తరించి ఖండనముండనమునఁ జూడఁబడుఁగాక,

"తగుచోట్లఁ బదివచనముల కన్న నెక్కుడు గఁ జెప్పఁజనదు"

ఇట్లు వ్రాయుటకుఁ గతమేమో తెలిసినదా! మీరు ప్రహ్లాదవంశములో గద్యముగాక 10 వచనములు మాత్రమే చెప్పియున్నారు, లోకులకు మార్గప్రదర్శకులును ప్రాథమికులును గావునఁ దమ ప్రవృత్తిని దృష్టాంతీకరించు కొమ్మనుచున్నారు,

"క॥ మీమాటలు మంత్రంబులు। మీ మెట్టినయెడ ప్రయాగ, మీపాదపవి। త్రామల తోయము లఘు। ద్యోమార్గఝరాంబు పౌనరుక్త్యములెన్నన్" (మనుచరిత్రము)

ప్రహ్లాద వంశములో గద్యకూడఁ గల్పికొన్నను శతసంఖ్యాపూర్తికాలేదు కావున నాలోకులారా! మీరెల్లరు నీవిధాన మొనరింప నిచ్చయున్నచో నీప్రాథమికుల నే యనుసరించి 99 ది మాత్రమే గద్యతో సరిపెట్టుఁ గొనుడు, ఇఁక రెండవ యావిధానము రామాయణము, అదియును దీనితో పాటు విమర్శింపఁబడినట్లు, వైలికె యందలి పద్యమొకటి యుదాహరింపఁబడుచున్నది.

"క॥ అందింపకు మొందునృప। నందనుఁడెంతయు మనమ్ము నం
దనరారక। బొందు గనేనవచించెద సందేహము లేదు భావ
శాబ్దికజీవా" (49 వ పుట)

ఈశాబ్దిక జీవత్వము యథార్థమునకు విరుద్ధముగాన విశ్రమభంగమున కొప్పికొని సమన్వయింపఁబడుఁగాక,

## 80 గురుని కష్టము.

ఉ॥ పన్నుగ నాకు సత్కవన పద్ధతి నేర్పిన బాల, శాస్త్రి సం।
పన్నుఁడు రాట్సభాస్థలిని, భాసిలుచుండఁగ మాటలాడఁగా।
గ్రన్నన నేర్చువాఁడ ననికాదు, ఫలింపఁ దదీయ యత్నముల్।
చిన్నతనంబువాఁడనని చెప్పితి నిప్పుడు కొన్ని పద్దెముల్॥
(19 వ పుట)

ఈబాలయు నాశాబ్దిక జీవుఁడును నొకరే వీరన్యోన్యమును గురుశిష్యులు అందులో వేంకట రామశాస్త్రి కవిగారు శాబ్దికుల సంతతిని జీవింపఁచేయు ఘనపాండితికలవారు. ఉదాహరణము లగంగ తద్వంద్వాదికములు. (మాతరపితరౌతుయయో)

విశ్వాసము. కందము

"క॥ విశ్వాసము గలవారికి। శశ్వత్సౌఖ్యంబు మిగులసంతోషంబుఁ।
విశ్వస్తవనీయతయున। నశ్వర భోగములు గలుగు నరనాథ
మణీ" ॥22 (64 వ పుట)

కృతజ్ఞత।

"క॥ ధరణిం గృతజ్ఞత గలిగిన। పురుషునకుఁ సర్వసౌఖ్యములు
తనరారున్। నిరతమును వాని దైవము। పరిపాలన సేయుచుండుఁ
భార్గవముఖ్యా" 64 (74 వ పుట)

పయిపద్యములలోని విశ్వాసకృతజ్ఞతలు వీరివలననే నేర్చుకోఁదగు, అవిధానమునకుఁ గాకున్నను దీనికి వీరు ప్రౌఢమికులు విధగాఁ గాఁగలరు. ఈ పద్యద్వయ మనుకూలముగానున్నది. ఈ నైనింగొన్ని యపహాస్యాస్పదములగు వాక్యములను పద్దెలను స్థాలీ పులాక న్యాయమునఁ జూపఁబడును,

(1) "మేమును కొన్ని నట్లు సంస్కృతాంధ్రములలోఁగాక వ్యస్తాక్షరి హబూణభాషలో నీయఁబడెను, కాని మేమది నిరంకుశముగా నెట్టి వేర్చినప్పుడు (శ్రీ)వారికరతాళములతో సభాసదులకరతాళమ్ములు రాజభవనము నిండించెను, నిషిద్ధాక్షరిలో మేము గనుపఱిచిన పాండితికి సెక్రటరీగారంతయు సంతోషించిరి" (2వ పుట)

"డే, ఆఫ్, స్లేప్సు, హౌ, డేర్, నాట్, బి, ఇన్, ది, రైట్
(11) (12) (13) (14)
విత్, టూ, ఆక్, త్రీ" (81 వ పుట)

ఇది వీరి రెండవ యష్టావధానములోని వ్యస్తాక్షరి, దీనికై వీరుపడిన శ్రమమెంతో విజ్ఞులెఱుంగుదురుగాక,

(2) "7 నిషిద్ధాక్షరి- బ్ర॥ దేవుల పల్లితమ్మన్న శాస్త్రులగారిచే నిషేధింపఁబడినది, వీరుభయ భాషాప్రవీణులు గాన నతికఠినముగా నిషేధించిరి"

ఈస్తుతి గూడ నాతో శ్లాఘాపాదకమేసుడీ

" లేఖకులు తొంటివలెఁగాక జాగరూకులై వ్రాయుట నిందు విశేషముగఁ బూరింప నవసరము గలుగ లేదు. కాన నిందుఁ బూరించినప్పుఁ గుండలీకరణము మానినారము"

(47 వ పుట)

ఇది వీరి రెండవ శతవిధాన పీఠిక, వెనుకటి కుండలీకరణ మెంత నిక్కమో యిప్పటి తదభావమును నంతేనిక్కము, మీరెట్లు వ్రాసికొన్న నడుగువారెవరు వ్రాసికొనుండు,

99 శతావధానముఁ జేయఁ గల్గినప్పము,

1 2 3 4 5 6 7 8 9 10
"హు, ఇజ్, కక్, విక్, స్టీ, ప, గక్, స్టీ, హింగ్, విల్,
11 12 13 14 15 16 17 18 19 20
ఇజ్, ఆఫ్, ది, సేమ్, ఒ, పి, వి, యక్, స్టి, ల్"

(24 వ పుట)

వీఁకిచ్చిన వ్యస్తాక్షరియిది, వీరు నిరంకుశముగా నెటువేర్పుటయుఁ గరతాళములను నెట్టివో చదువరులే తెలిసికొందురుగాక,

(1) (2) (3) (4) (5) (6) (7) (8) (9) (10)

" తే॥ మనము చెడిపోవు నవధానమును బూనన్బ్ర।
నట్టివారికి హృదయము నందునెట్టి ।
పుట్టుఁ గావున నియ్యది యెట్టియెడలఁ ।
జేయరాదు నరేంద్రుల చెంతగాని" ॥

అవును. ఏపట్టణ సభలోనైన జేసినచో మనయాటలు సాఁగిరావుగాన మనకీని యమ మూవశ్యకమేకాని! నరేంద్రులచెంతఁ జేసినచో వెట్టఁ బుట్టదేమి! పుట్టదు. సత్యమే, సభ్యులు తమకుఁ దోఁచినట్లడుగక నరేంద్రు నభిప్రాయము ననుసరింతురు. వారు ప్రకృతావధానుల తెలివికిఁ దగిన ట్లడుగుచునుందురు, ఇది యిట్లుండుడుగాని నేటికి ముమారు 25 వత్సరములనుండి యనేకాష్టావధానశతావధానములు రాజసభలయందును బట్టణములయందును బల్లెలయందును బూనచ్చి నిన్నగాక మొన్న నీశ్వరవేరులను "జేగురుబెండ్ల" మనిపించి "మేకుబిగించిలాగి బలిమిన్ బలుముక్కలు" చేసిన బ్ర॥ శ్రీ॥ తిరుపతి శాస్త్రిగారిప్పటికిని శతావధానమున్న నిరంకుశముగ నెఱవేర్చుచున్నారే, నైపుణ్యము వీరవధానులు గామిం దెలుపుచున్నది. లేనిచో "ప్రథమ కబళే మక్షికాపాతః" యను తెలుఁగున నిట్లువ్రాయవలసియుండదు మఱియు 4 వ పుటలో నక్షితుదను గ్రంథముల పట్టిక వ్రాయఁబడియున్నది. అందు "కుకవి నిందనము" అను నది యొకటి, అక్కటా! ప్రతిమనుజుఁడును దాను సుకవిననియే తలఁచునని దానివలనఁ దెలిసికోఁ బడుఁగాక, మఱియు నా పట్టిక క్రింద,

" అత్యద్భుత శతావధానులు"

అనియున్నది- 28 వ పుటలోఁ బీఠికాంతమున,

" శతావధానులు "

అని మాత్రమేయున్నది. ఇంతలో ననఁగా మధ్యగల 24 వ పుటల వ్యవధిలో నాయత్యద్భుతపుఁగంతి యంతరించి నట్లూహింపనయ్యెడిని, మఱియు (6) వ పుట లో చేవ్రాలుతుదను-

" సశేషము "

అనియున్నది. ఇది చేవ్రాలింకను ముందుఁ గలవుగాన వానింబట్టి "సశేషము" లేక గ్రంథముల పట్టికకు, సంబంధించునా: యనిచూడ రాజానురంజనమునని తేలిన నది. ఈసారి ముద్రణమున నదితీసి వేయవచ్చును. ఎల్లచోటులను నిట్టి కుమానావధానములు పనికిరావని నానమ్మకము, స్థిరోద్భవ, సుప్రసన్నోద్భవ, వరదోద్భవ,

ఉ॥ "బాలుని దల్లిచెంతటి కెడఁబాపి యయోమయపేటినుంచి నీ
తొలిమిమాని నీరధిపదంబునవైవు"మటంచుఁబంచె న
న్నేలిననాయుఁడీకరణి హింసకులోఁబడి మీరు సత్కృపా
శీలురగానఁ జూడుఁడిది చెప్పితి నా గమనార్థమాదిగన్॥ 297

వ॥ అదియునుంగాక.

కం॥ సాటింపఁబంచెబురి "నీ । పేటఁగలసుదతులెల్ల వినుఁడీరాత్రిన్
గాటిం బిసుకులుపుట్టినఁ । జేటగు నటవీస్థలంబుఁ జేర్పుఁ"డటంచున్॥ 299

వ॥ అని సాటించిన విప్ర కళాద పాదజ కులాల నాపిత రజకాంగనలు భయంబున. 300

కం॥ గండమునఁ బుట్టిరని వే । దండగమనలార్తు రౌరి దండను వడి నే
రండ క్షేత్రంబులలో । నొండొండఁ బరిత్యజించి రొగి డింభకులన్॥ 301

తే॥ అనినఁ గన్నీరునించి యయ్యతిగుణాఢ్యుఁ । "డిట్టివంశాంకురచ్ఛేద మెందుగల"ద
టంచుఁ జేటికలోఁ బవ్వళించియున్న । బాలునీక్షించి పరమకృపాళుఁడగుచు॥ 302

కం॥ కన్నమ! నాకాప్తుఁడు నీ । కన్న నొకండైన లేఁడు కావున మదిలో
నున్నది చెప్పెద నికమాఁ । యన్నకుఁ దెలియంగనీవు మన్నకుమారా! 303

ఉ॥ పుడమిసమస్తజంతువులుపుట్టఁగఁ దోడనెపుట్టుమృత్యు వి
ద్యోడఁ గసిగందు వీని సమయించినఁ దప్పునె? వారిగండముల్
జడమతులైన బాలవధ సల్పుదురే? మన కెన్నినాళ్ళు ని
ల్పడగల దింక రేపనెడి కాలముగల్గునె? మర్త్యకోటికిన్॥ 304

వ॥ అదియునుంగాక. 305

సీ॥ సకలబాంధవకోటి సమసిపోవఁగనిమ్ము వీరుఁ లాయమునిల్లుఁ జేరనిమ్ము
పోటుమన్నీలెల్లఁ బోలిసిపోవఁగనిమ్ము శూరులు సురపురిఁ జొచ్చనిమ్ము
భటులబాహాశక్తి పాడువారఁగనిమ్ము పుత్రమిత్రాదులు పోలియనిమ్ము
భ్రాతృకళత్రోపమాతృకల్ డగనిమ్ము పౌరులగుండియల్ పగులనిమ్ము
నేఁడు మాచర్లపురి వాడవాడలగ్గి । రవులుకొని కాలనిమ్ము మీరాజ్యమెల్ల
మడిసి చెడనిమ్ము మీబాలుమనుపవాఁడ । నాయునకుఁ జెప్పకుండు కన్నమకుమారా!

కం॥ బాలుఁడు జననం బొందిన । కాలంబునఁ బుట్టినట్టి కసిగందుల నా
బాలామణు లెత్తుకొంతలఁ । గ్రాలంబడ వైచినారొ? గండభయమునన్ । 307

తే॥ వారి వెదకి తెమ్ము వసుధాజనంబులు । చూడకుండ నతివిశుద్ధచరిత !
బాలుతోడఁ బుట్టుపసిబాలు లందఱు । బాలునకును సహాయపరులు గారొ? 308

కం॥ కన్నమ! యీకార్యము పురి । నున్న జనం బెఱుఁగకుండ నొకచోఁ బిదపన్
గొన్నిదినంబులు దాచెదఁ । జెన్నుఁడు గలఁ డింక మీఁదఁ జెప్పఁగవలెనే? 309

తే॥ అనుచుఁ జేర్చెను తత్పేటికాంతరమున । నన్నబాలునకును స్వకీయోత్తరీయ
పరయు నుల్లోకఁ గావించి యోజించి । తెచ్చి తనజాయ కలవని కిచ్చె నపుడు॥ 310

కం॥ పాత్రుం డగు కన్నమ యా । రాత్రి భయం బింతలేక తా నెరగండు
క్షేత్రంబుల నతిమంజుల - గాత్రంబుల నొప్పియున్నఁ గని డింభకులన్॥ 311

కం॥ కని దీనుఁడు రత్నంబును । గొను క్రియ నా డింభకులను గొంకక నాచ్ఛా
దనమున నిమిడ్చి సత్వర । మునఁ దెచ్చెన్ జనులకన్ను మొఱఁగి వీథిన్॥ 312

కం॥ తెచ్చి వెస నతని కిచ్చిన । నచ్చతురుఁడు ధర్మపత్నికానందముతో
నిచ్చె సవిస్మయమతితో । నచ్చపలవిశాలనయన యనవనతముఖియై॥ 313

తే॥ "నాథ! నాబోటిబోటు లేనాఁటఁ బ్రోకు । రచలితప్రేమతోడ నన్యాయమిదియుఁ
వంధ్యనగు నాకుఁ దరమె? కావంగఁ జన్నుబాలె । జీవనమగు చిన్నబాలకులకు॥ 314

చ॥ ఇతరు లెఱుంగకుండ జనయిత్రి నిజాత్మజు వేడ్కఁ బెంపఁగా
జతనముసేయలే దొకతెఁ బాలుఁడు నెట్టు లనేకబాలకా
వృత్తికి మహానుభావ! భవదీయనిదేశ మతిక్రమింప దు
ర్మతినె? మహీశ్వరుం డెఱిఁగి మన్ననసేయునె? మిత్రవల్లభా 315

ఆ॥ వాసలేనివఱదవచ్చున మనకేల? గండశాబకులను గన్నతల్లు
లుండ మనము పెంప నొప్పునే? యోచించి, చూడుఁ డింకఁ జెప్ప నాదుదాన॥316

ఉ॥ బాలకు నొక్కనిం గనిన భామిని దుగ్ధవిలోపమొందినన్

దాలిమిలేక బాలునకు దాదులనిల్పుదు రన్న యెందఱో
బాలుర నొక్కవంధ్య చనుబాలొసఁగంగ మహాద్భుతంబు జే
జేలకునైన నెత్తెఱఁగు జెప్పెదరో? పరికించిచూడుఁడీ! 317

తే॥ అనిన వేర్వేఁడు దరహాసతాస్యుఁడగుచు। "బాలికామణి! యీచిన్నిబాలకులను
బుట్టఁజేసిన చెన్నుండు పూని మేసఁ । దలచె నే? నీకు నీ దుస్స్వాతంత్ర్య మేల? 318

ఉ॥ చెన్నుని జేరఁబోయి నతిచేసి విశుద్ధమనస్కయై "సదా
పన్నశరణ్య! నీపదముభక్తుల బాలురఁ బ్రోచెదేని నా
చన్నులఁ బాలు నేఁడు సరసంబుగఁ జూడుము" మటంచు నీవు నా
వెన్నుని వేఁడు మిప్పుడిఁక బవిత్రచరిత్రుఁడతండు భామినీ!" 319

వ॥ అనియదుపదేశంబిన యచ్చంద్రవదన చంద్రభాగాజలంబుల సవగాహనంబు చేసి హరిద్రకుంకుమాదిచూర్ణపరిష్కృతవదనారవిందయై మాణిక్యఖచితమంజుమంజీరశింజితంబులు నఘులపందువులు సేయ మత్తమరాళగమనంబున నీశ్వరాలయంబునుజేరఁజని చ్చికరకంజంబులు మొగిడ్చి యిట్లనియె 320

ఆ॥ చెన్నరాయ! నీకుఁ జేతులు మొగుడించి । విన్నవింతు నొక్కవిన్నపంబు
భక్తపారిజాత! పరమకృపోపేత! యపరిభూతపోషితాబ్జజాత! 321

కం॥ ఒక్కసుతునడుగ నీ వా । లొక్కరవడిఁగట్టి లింక నుచితమె? ధరణిక్
నిక్కముగ నర్థి కోర్కెను । నెక్కుడుగా నొసఁగనతఁడె హితవరిగాఁడే? 322

ఆ॥ "అయ్యరన్న" యనుచు నాగమంబులు దెల్ప । సుతులనిచ్చి భుక్తిఁ జూపవేల?
"నాలుపోయునతఁడె నీరువోయు"నటన్న । పలుకు నిబ్బ ఱయ్యెఁ బంకజాక్ష! 323

కం॥ ఈలీల సుతులనిచ్చి కృ । పాలోలుఁడవైన నఁ జన్నుఁబాలేటికి నా
పాలిండ్లఁ గలుగఁజేయవు । దేలా? మాచెర్లచెన్న! హేయవిభిన్నా! 324

సీ॥ దుస్తరంబుగ రోహిణీస్తనంబులదుగ్ధములనింపలేదె? సౌమ్యుండు గోల
ధర గృత్తికాపయోధరపంక్తి పాల్చేసియుండఁజేయవె? కుమారుండు ద్రావఁ
బ్రద్యుమ్ను నకు నళంబుకునింటరతిప్రోవ క్షీరముల్ గలుగంగఁ జేయలేదె?

యుపమన్యునకును మాతృపరోక్షమునఁ బాలకడలిఁ ద్రావఁగనీవె? కరుణతోడ
నాఁడు మొఱవినకున్న నీ కపయశంబు । "ఈఁదగు"నటన్న నెవరునీ కింతలేదు
తాను నాడితిని యశోదాకుమార! పాలదొంగవు నీవు పాలేల లేవు? 325

మ॥ అని ప్రార్థించిన మందహాసవదనుండై చెన్నరాయుండు న
వ్వనజాతేక్షణ నిచ్చ మెచ్చి కరుణావ్యాపారితాలోకనం
బునఁ జూడం గరుపాటునొందిన భయంబుం బెంది పాలింద్గుచే
పిన దుగ్ధంబులు గాఁ గాఁ జనిగొ సంప్రీతిన్ విభుం జేరఁగన్ 326

ఆ॥ మగనిఁ జేరఁబోయి మగువ యింద్రఁగా మెల్లఁ । జెప్పి డింభకులకుఁ జేపియున్న
దుగ్ధరసము లిచ్చె దూఁపిలి కుడువంగ, నేడ్గురికిని బ్రేమ నెక్కుడుగను 327

సీ॥ బాలకుల్ గుడువంగఁ బాలు కాలువలయ్యె వెలదికిఁ జలివుట్టె వేఁకివచ్చె
ధరియింపలేక ముందటిరీతిఁ జెన్నని గుడికేగి తత్పదాంగుష్ఠములకు
నతి చేసి నిల్చి "దానవవైరి! ననుఁ బరీక్షింపఁగా నలెనె? రక్షింపలేవె?
యబలల నేఁచంగ నగునె? నీ వంటి దేవశిఖామణికిఁ జెప్పవలెనె మిగుల?
నేకపుత్రునడుగ నేడ్గురనిచ్చితి, పరసె పాలువేఁడ నపరిమితము
గాఁగనిచ్చి తింక గణుతింపఁ బాలేల? బాలురేల? నాకుఁ బద్మనయన!" 328

కం॥ అని గౌరీసతి తత్పద, వనజసమీపమున మేను వ్రాల్చి విమోహం
బునఁ గన్నుమోడ్చఁ గలవలె, వనజాక్షుండిట్లు చెప్పె వనితామణికిన్ 329

తే॥ ఇంతి! నీ కోర్కి సిద్ధింపనిచ్చినాఁడ, బాలు వెక్కసమైయుండ బాలురకును
మరలఁ గొనవేర నేఁ దగుమాత్రమునిచి, రమణిఁ గొనవేర్చుఁ గొండలరాయఁడబల

చం॥ అనవిని మేలుకాంచి కమలాక్షియుఁ గొండలరాయుఁ జేరఁగాఁ
జని "తపనీయచేల! దనుజప్రతికూల! శుభాలవాల! నా
చనుగవ దుగ్ధభారము సడంగ లవాఁ డవటంచుఁ జెప్పఁగా
విని యరుదెంచితిం దనువు వేడిమి మాన్పఁగదే కృపానిధీ!" 331
వ॥ అని వినుతించి. 332

ఆ॥ కోరియట్లు మ్రొక్కఁ గొండలరాయుండు, తగినమాత్రము నుంచి తరుణిచంటి
పాలుగొనియెఁ జిన్నబాలలలోనున్న, యతఁడు తానుగాఁడె? మతిఁ దలంప॥ 333

కం॥ గౌరీలలను యివ్విధిఁ, గోరికలీడేర ముద్దుకొడుకులను ముదం
బారఁగఁ బోషింపఁగ న, ప్పౌరజనుల్ దెలియనేరరి బాలురవార్తల్॥ 334

వ॥ ఇట్లు గౌరాంబికాసాహాయ్యంబునం బేర్చీఁడు పురజనంబులకుం దెలియకుండ సింహకిశోరంబులపగిదిం బెరుఁగుచుండిరని చెప్పిన. 335

శా॥ సారాచారవిహార! పారగకవీశస్వచ్ఛగంగావరి
తూర్వారాహీశమరాళహీరశరకర్పూరామరాహారమం
దారాబ్జాసనసుందరీహిమకరోదారస్ఫురన్మల్లికా
సౌరానేకపనిర్మలస్ఫుటయశస్సంక్రాంతదిక్సంచయా! 336

మాలిని.

వివిధసుకవిమిత్రా! విద్వదాహ్లాదపాత్రా!
భవతృణగణదాత్రా! పంకజాభాసనేత్రా!
పరివిమలశుభగాత్రా! భవ్యవిజ్ఞానసూత్రా!
యవిరళరిపుజైత్రా! హారిధర్మాత్తపత్రా! 337

గద్య.

ఇది శ్రీమన్మల్లికార్జునకృపాలబ్ధకవితాప్రకాండ మదిగొండభోగమల్లేశ్వ
రారాధ్యపుత్ర సద్గుణసముద్ర వీరభద్ర ప్రణీతంబైన వీరభాగ
వతంబను మహాప్రబంధంబునందుఁ దృతీయాశ్వాసము.



# వీరభాగవతము

——:( ):——

## చతుర్థాశ్వాసము.

కం॥ శ్రీరమణాంఘ్రిసరోజ । స్ఫారభ్రమరాయమాణభావ ! శుభాంచ
ద్వీరాచారవిహార స । దారచితాధార ! యల్లయాహ్వయధీరా! 1

తే॥ అవధరింపుము సర్వవిద్యాప్రవీణుఁ । డైన ధర్మప్రసంగుని యాననంబుఁ
జూచి సన్మునివర్యు లస్తోకభక్తి । నడిగి రబ్బాలకులచర్య లతిముదమున॥ 2

ఉ॥ "నీలగళోపమానవరశీయము బాలునిచర్య మాకు నా
మూలముగాఁగఁ జెప్పు"మని మ్రొక్కిన సమ్మునిచంద్రుఁ డద్రిజా
లోలుని మానసాంబుజములోనిడి దివ్యతరంగిణీతరం
గాలసవాక్పరంపరల నచ్చటిమౌనుల కెల్ల నిట్లనున్॥ 3

తే॥ వినుఁడు మునులార! యబ్బాలు రనవరతము, పూని గౌరాంబికా స్తన్యపానమునను
వెలయఁ బెఱిఁగిరి బాలచంద్రులవిధమున, జనని చిత్తంబులోన విస్మయమునొంద॥ 4

సీ॥ గరిమ నైతాంబికాగర్భామృతాంభోధిఁ దోఁచిన బాలచంద్రుం డొకండు
విప్రాంగనకునుద్భవించినతనయుండు మనుబోతురాజునామమునఁ డొకండు
వెలమవెలందికిఁ గలిగినతనయుండు దోరన్న యనిముద్దుపేరుగొనియె
స్వర్ణకారాంగనాసంభూతుఁడగుడింభకుండు వీరుండనఁ గొమరుమిగిలెఁ
గుమ్మరివెలంతికొడుకు ధర్ముం డనంగఁ, దనరరజకిసుతుండు చందన్న యనఁగ
నరనాపకసుతుండు మంచన్న నాఁగ, నేడ్గు రొక్కటఁ గ్రీడించి రెసక మెసఁగ 5

కం॥ అంతఃపురమునఁ జేర్చిఁ, డింతియుఁ బ్రియమంద బాలు రింతింతన మే
ల్బంతులయి చదువులను దా, మంతర్వాణులనమించి రాఅబ్దములన్॥ 6

కం॥ సాముఁ జదువున నేర్పరు, లై మించి తురంగరథసమారోహణముల్
సామర్థ్యమెసఁగ నేర్చి ని, రామయగాత్రముల నొప్పి రా పసిబాలుర్॥ 7

మ॥ హరిదశ్వుండును బద్మినీప్రియుఁడు నై యారూఢమీనాంతవి
స్ఫురణం భానుఁడు లోకబాంధవుఁడనన్ శోభిల్లెఁ గందర్పుఁడున్
హరిదశ్వుండును బద్మినీప్రియుఁడు నై యారూఢమీనాంతవి
స్ఫురణన్ భానుఁడు లోకబాంధవుఁడనన్ శోభిల్లె నయ్యామనిన్ 114

మ॥ మధుపశ్రీప్రౌఢతరాధికారి నయవిన్యాసగ్రాజితామోదన
ర్నిధనాళిన్ సుమనోనికుంజ నవభాండాగారము న్నింపఁ ద
న్నిధు లెల్లన్ బరికించు రీతి మెలఁగు న్వైహారు శ్రీఖండరా
జ్యధురీణానిలరాజమౌళి భ్రమరీసంగీతమేళంబుతోన్ 115

కం॥ ఆయామని నుపవనమున, నా యామవతీమనోవిహారుని కైదో
డాయామవినోదంబుల, నాయామని కింజరింప నత్యుత్సుకయై, 116

తే॥ వనలు గొనుకోర్కె నంబుజాననలు గొలువఁ జన యగారోపవని కర్థితనయ చనియెఁ
జరణమంజీరనినదసంచరణమునకు, గములుగొని హంసతతులు లూడిగములు సేయ, 117

కం॥ ఆరామమున ననిటుచని, యారామ చరింపఁ జెలువ లచటి మరందా
సారాప్లుతపూరామిత, సారాశ్రితపవనరచన సంఘాలఁ దములోన్ 118

చం॥ మలయజగంధి! పాంథజనమర్దనదృష్టి హరుం డురాగఁ ద
ద్బలముల నెచ్చరించుట కుదారత నాగసరంబుఁ బట్టి పెం
పలవడఁ జూచితే తలిరుటాకుననుడిన్ వనంబుఁ గూర్చి కో
కిలము కలస్వనంబు దులకింపఁగ గ్రోల్చె తెఱంగు లిచ్చటన్ 119

కం॥ కుందమకరందతుందిల, బృందధ్వని పాటబాడె చెమనఁ దగి శ్రీ
యిందిర తనమందిరమున, గందిర మునరాఁగ నెదురుకొను గతిఁ గంటే 120

చం॥ నిబిడమనోజ్ఞభాగమున నిస్తులబాలరసాలపల్లవ
స్తబకమునం దబోవు ఘనషట్పదమాలిక నందుఁ జూచితే
యబల! మహేంద్రదిగ్గిరితటాంతరరక్తరుణార్కమండలీ
కబళనబుద్ధి గ్రందుకొను మాతుకకేతుపురీతిఁ దెల్పెడిన్ 121

చం॥ అల మలయాద్రిచందనసమన్వితకృష్ణభుజంగముక్తుఁడై
యాల సము మమందగంధవహుఁ డచ్చటనుండి కవచ్చి యిచ్చటన్

మొలఁగుమింశదమాలికల మొందుఁగనుంగొని తద్భయంబులోఁ
వలమ నదృశ్యుఁడైనగతి నల్లనవీచువిధంబుఁ జూచితే 122

చం॥ తలిరులఁ గోకిలమ్మ మధుధారలఁ దేటిఁ పరాగమున్ మదా
నిలుఁడు ఫలంబులన్ జిలుక నిచ్చలు రాయిడిసేయ వానిపై
నెలకొనుకోపదృష్టిని వనీరమ చూచెమ్మగ మెఱ్ఱచేసినా
బలియునశోకకింశుకజపాకుసుమద్యుతిఁ గంటె నెచ్చెలీ! 125

చం॥ రణవిజయాత్మభూభటులు రచ్చలఁ బల్విడి గోఁకఁ జూచి సై
రణగను టెట్లు? మారునిశరంబులనుండి వియోగధైర్యమిం
దణువయితూల దే? సమధికాళిపికాళిశుకాళిమాలికా
రణనముఁ గూడి యౌవనపురాళికరాళి విదాళిఁ గొల్పఁగన్ 124

సీ॥ శుకి ప్రాణసఖుఁ బాసి సొలిసి యుస్సురనంచె లలనా! యీకెలన కాదళము దళము
విభుఁ గానక రసికోకిల దావెడలఁ గ్రక్కె నవల! యీ యువలపల్లవము లవము
అంచ నాస్వనిదూతి యంబకదుర్ములు రేచె రామ! యీ సీము నీరజము రజము
పతితో నెడసి తేఁటి బలిమి రెక్కలు మ్రొక్కె జాన! యీ చానకేసరము సరము
నను చుంచమలోన భ్రమలూనవినయాలగుచుఁ, గలిసిగుమిగూడితమినూడిగములుసతులు
మదినుబుసుపోక రసపాకమర్మవచన,రచనఁ గొని యూడవిని ప్రౌఢరమణుఁ దలఁచి

చం॥ అగణితయౌవనోదయసముంచితగానవసంతవాసరం
బగుటయుఁ గేళికావనవిహారముఁ గాంచుటయున్ సఖీవచో
నుగతశుకాదికార్భటియునుం బరికించుచు నుండెరుఖ్యలనన్
విగళితధైర్యయయ్యె నరవిందనిభానన కేశవస్మృతిన్ 126

కం॥ ఆ లోకజనని వనవిభ,వాలోకనజనితరాగయై కొంకఁగఁ దా,
నాలోఁకువగనిరతిపతి,యాలోఁ గుతుకమున వింటి నమ్మునుటించెన్ 127

మ॥ సమదేందిందిరశింజినీకృతధనుష్టంకారుఁ డంభశ్చరాం
కమహావీరుఁడు కీరశారిభటహుంకారంబుమీరంగ దు
ర్దమసక్తిన్ దొరగింప నమ్ములను జంతన్ వాతపోతోద్ధతిన్
సుమములోరాల విరాళిఁ గాంచిరమ యస్తోకప్రకంపాత్మయై 128

ఉ॥ "చుంబనరాగరక్తమధుసూదనయీలతనూనగాంధముపోం
కంబిటువంటిచేరీ" యనినం గన్గొనఁబాలకపాలికొంచ న
య్యంబుజపాణి కిలకిఁగి యందొక పాణివయస్యడాసి రో
స్యంబునమందహాసరుచిసంఫుల్ల మంజులరీతినిట్లనున్॥ 129

కం॥ బాలా! నీలాగేలా, గేలా డోలానుకూలహేలాలోలా,
వేలాళీలాలితముల, చాలా మేలాని చూడఁజాలవదేలా ? 130

తే॥ నీరజావాస! నీవేణి పేరుమోచి, కాదె? షట్పదవిఖ్యాతిఁ గాంచెనళులు
జననమొందిన మొదలు నీనడనమునసె, యుత్తిపెంచినవానిసైనేటి? కలుగ॥ 131

క॥ తరళేక్షణ! నీదృష్టికి, సరిపోదనవలను భృంగసంఘము సామన్
పరిపాక మెఱిఁగి తిరుగును, పరికింపఁగ నలినుగుణ విభాసితమహిమన్॥ 132

సీ॥ నీ మోము సౌమ్యమందిన కంజమునదల్చి చను పాడఁ బాడ తాడన మొనర్చు
నీబాహులకుఁ బ్రీతిని ధృతైనలతికలఁ బెనఁగొని మిగులఁగంపింపఁజేయు
నీకుచస్ఫూర్తిపాండిత్యంబుఁగను సుమస్తబకంబులను నీర సంబొనర్చు
నిపదంబులసాటి నిలకోను లేఁజిగురాకులదూఁటి జీకాకుపఱచు
నీతనూదివ్యగంధసన్నిభములైన-జిలుగుపుప్పొడి రెక్కలదులిచివైచు,
నీప్రియాళులపైనల్ల నేమికతము, కుందకోరకరదన! యోమందగమన 133

ఉ॥ ఇక్కడఁ దేటిబోటి హృదయేశ్వరుఁ గానని కాఁపె నెమ్మదిన్
బొక్కుచు రెక్కలన్ గుసుమపూరపరాగము రాల్చ రేణువం
దొక్కటి నీదృగంచలమునొందెను నింతటు గాక యున్న నీ
యుక్కునుగోరఁగించుటకు హేతువదేమి? మదేభగామినీ! 134

ఉ॥ భూరినికుంజగుంజదళిపుంజముమీఁద నెకాదు నీదుకో
పారుణవీక్షణంబు లలనా! కలనాదవినోదకారికా
కీరపికాళిమీఁదఁ దులకింపఁగ సాఁగె మనఃప్రచారమే
తీరొక? వింతదోచెను మదిన్ దిలకింపఁగ నీదు చిత్రముల్॥ 136

ఉ॥ కైరవనేత్రి! చైత్రసహకారము కోకిలకాకలీకుహూ
కారము చిల్కపల్కుసుడికారము నంచి తేఁచంచరీకఝుం

కారము కారమై స్మరవికారముఁ జూపెనొ కాక యొంచితో
కార మధీశసంగమ సకారణమై కనుపించ నెంచఁగన్॥ 136

కం॥ నాతోడను నీయభీష్టము, నాతోడఁ దెల్పు మాత్మ నైపుణి నిపుడే
నీతోడు నిన్నుఁగూర్తును, నీతోడు వియస్సనాభు నీరజనాభున్॥ 137

కం॥ అని తను చెలిమిన్ బలికెడి, వనితనుగనునంత వీచె వనరుహగ్రహావా
సినితనులతిగంపింపఁగ, జనితత్వర మలయశైలచలనానిలమ్ముల్॥ 13౮

సీ॥ కమనీయగతినిట్లు కమ్మని తావుల మెలయు నా చలువ తెమ్మెరలఁ జూచి
మెలయు నా చలువ తెమ్మెరలకు నొక్కి నినచ్చు పటుల తాంతపరాగపటలిఁ జూచి
పటుల తాంతపరాగపటలి నంటి, వహించు చిక్కని పూఁదేనె చిమ్ముఁ జూచి
చిక్కని పూఁదేనె చిమ్ము వెదొక్కని వచ్చు తుంజన్మ భృంగవ్రాతములఁ జూచి
"ముదిత! యిది భూమి యిది నీర మిదియు తేజ, మిది సమీరణ మిన్నియు నెనయుకతన
జడియు జలరాశి యిచ్చట వడిఁ దిరాగు, ననుమను చునొక్కవంత పుంజలి కేఁ జేరి॥ 139

ఉ॥ మానిని యిట్లు కేళివనమధ్యమున కరదిందుచంద్రికా
శ్రీ నగు నంతఃపుంజమి కేఁజేరి తదంతరచంద్రకాంత సం
ధానిత వేదికాతలమునన్ వసియించె సువర్ణపుత్రికా
నూనకరాబ్జసంధృత సముజ్జ్వల చామరరాజి రాజిలన్॥ 146

మ॥ స్ఫురదష్టాపద నేత్ర! నేత్రరుచి సంశోభాంబురుట్పుత్ర! ప
త్రరథాధీశ నుతి పాత్ర! పాత్రభువన భ్రాజత్సుకీర్తి మిత్ర! ని
త్రిరుగంచత్కటిసూత్ర! సూత్రరచనా ప్రాగల్భ్య వాగ్గోత్ర! గో
త్రిరిపుశ్రీవనచైత్ర! చైత్రరథనాథత్రాణవిశ్రాణనా! 141

కం॥ ఖగరాట్తురంగ! రంగ, జ్జగదవనాభావ్యసంగ! సంగతకపటా
సుగశకటభంగ! భంగ, స్థగితాంబరసింధుభయదజయపటుహరదా! 162

తురంగవృత్తము.

బాలాగోపాల! లీలామోహన! భద్రవినిద్ర! సముద్రనివాసా!
శైలోద్ధారణ! శిలావారణ! శౌరి! మురారి! ధరారివిలాసా!
నాళీకోదర! కేళీనారద! నాదవినోద! పయోదవికాసా!
కాళీయావన! పాళీభావన! కామసుధామ! సుధామసుహాసా! 143

గద్య.

ఇది శ్రీవెంకటరమణకరుణాకటాక్ష సంప్రాప్తసాగస్వతవైభవ వాక్యధురీ
మాత్యతనూభవ రసికజనహృదయంగమ సంగీతసాహిత్యకళాధౌరంధర్య
రాయసము వేంకటపతిమంత్రివర్య ప్రణీతంబైన లక్ష్మీవిలాసం
బను మహాప్రబంధంబునందుఁ దృతీయాశ్వాసము.

నానారాజసందర్శనము-తిరుపతి వెంకటకవులు.

సీ॥ నెలలేగుభూమి రోజులకేగుగతి ధూమశకటంబులేనాఁడు సంభవించె
బరదేశములవార్తబడయువిద్యుత్తంతుసంపత్తులేనాఁడు సంభవించె
వర్ణభేదములేకపలువిద్యలనునేర్పు చదువుబళ్ళేనాఁడు సంభవించె
మగవాంఢ్రతోసమంబుగనాఁడువాంఢ్రకుఁ జదువుకోలేనాఁడుసంభవించె
నుప్పుపండనిభూములు కప్పలొందవి, శాలిధాన్యంబులేనాఁడు సంభవించె
నట్టియొంగ్రెసువిక్టోరియామతల్లి, మరణవార్తకుఁ గడుపులు చెఱువు గావె॥

సీ॥ ఏనుగ్రీస్తుమతంబు దాననైనను మీమతములజోలికిరాను తాఁకు పవని
నందఁగాఁ జగువారలైన నిచ్చెదఁగాని తఱుతనువర్ణభేదంబుఁజూడ
వీరుమావారనుభేదంబుఁజూడ కందఱిపై సమంబుగా దయ నునిచెద
మీతృప్తినాతృప్తి మీవృద్ధినావృద్ధి మీకృతజ్ఞుఁజేఁత నాకుఁగొప్ప

పంచపాది.

బహుమతియటంచు మున్ను మాపదమునకును
జక్రవర్తినివగునాఁడు సల్పిన ప్రతి
నఁకు నలుసంతభేదంబుగలుగకుండ
నవనిభరియించి మిగుల్కృతార్థవైతి
వోమహారాజ్ఞి! విక్టోరియామతల్లి!

పైపద్యములవలన బ్రిటీషువారిది ప్రజలకత్యంతసౌఖ్యకరమైన ధర్మప్రభుత్వమనియు మతవిషయమున నుదాసీనభావమనియు స్పష్టపడుచున్నయది. కావున నెన్నన్నఁగో విశ్వబ్రాహ్మణులని చెప్పుకొనువారి నశ్లేవ్రాయుఁడని పంపిననోటీసులవలన గంసాలులకు బ్రాహ్మణ్యమును స్థిరీకరించిరనియనుకొనుట పొరపాటు.

ఈచిత్తూరుజిల్లాతీర్పునే యాధారము చేసికొని యేతత్కులజాలందఱును బ్రాహ్మణులతోఁ గయ్యమునకుఁ గాలుద్రవ్వుచుందురు. ఈతీర్పునై ఖరిఁబట్టి చూడ నసత్యమైనదని యందఱికిందోఁచకమానదు- నిజముగానీతీర్పు కోర్టువారువిధించియుండినను నిది హైకోర్టుతీర్పుకాదు. కావున నిదియే ప్రమాణమని వీరుసంతోషించుచు మితిమీరి ప్రసంగించుటకును నిట్టివిది యెుక్కవజాతియనియు బ్రాహ్మణులే తక్కువవారనియు

మూర్ఖులు భ్రమపడుటకు నవసరములేదు. మఱియును, ఈతీర్పంతయుఁగరమవకతవకగా
నున్నది. 1818వ సంవత్సరపుదగుటవలన నిప్పటికి నూఱు సంవత్సరములనాటి తీర్పై
యున్నది. దీని నిజముకల్లనరయుఁ వారికప్పటిజడ్జిమెంటు పట్టికను కాపీదొరుకనేరదు
కావున నీవిశ్వబ్రాహ్మణ శబ్దమును దమకనుకూలములగుకొన్ని యవకతవక ప్రమాణము
లను నెట్టుకలిపింపఁబడెనో యట్టే యీతీర్పుగూడ వీరిచేనచ్చొత్తింపఁబడినట్లు తోఁ
చెడిని, కంసాలియైన వాండ్లెల్ల నీతీర్పొకటి చేతఁబట్టుకొని బ్రాహ్మణు లటువంటి వారి
టువంటి వారని వాపోవుచు నకారణ కలహములను దిగుచుందురు. ఇందుకుఁదా
ర్కాణముగఁ బ్రకృతసమాచారమొకటికనఁబఱచెద. గుంటూరుతాలూకా ప్రత్తిపా
డను నూరఁ జామర్తి వెక్కటయ్య పేరింటి కంసాలి యొకించుక తద్దినపుమంత్రము వగ్గరా
చిల్లరలు నేర్చికొనెనఁట. అందుకాతఁడు తన్నుఁబాఘనాంత స్వాధ్యాయపరునిగా
భావించుమంజేతనైనపని యాగుట రెండుకుండలములు చేసిపెట్టుకొని పింజెగోచీలను
నుంఛారుపోధారులోనగు ఛాందసోక్తులును నేర్చి వెన్నువిఱిచి తిరుగుచుండెను. ఇ
ట్లుతిరుగుచునీ చిత్తూరుజిల్లాతీర్పులోనే చేరిన "ప్రాచీదిశాంవసంతర్త్వానాం" మొదలగు
వాక్యములస్వరవిహీనముగఁబాఠముచేసి యాయూరనుజుట్టుపట్టుచు స్వకులస్థులయిం
డ్లనపరకర్మలు చేయించుచు మూర్ఖులగునితరవర్ణస్థుల మోములను కొండఱు బ్రాహ్మణుల
మోములనునపస్వరమంతోచ్చారణచేనాత్మతిశయముంజూపుచు వేలుపెట్టికొని కాలు వి
ట్టరాదనిశూద్రులయిండ్ల విశ్వదేవరపాత్రలనకిప్పించుఁడని బ్రాహ్మణులనాశ్రయింపఁజొ
చ్చెను. అందుకాయూరి వైదికోత్తములుమదియందిందుకర్తవ్యమైనవాఁడుకాఁడనిదృఢము
గా నెఱింగియుఁదక్కులజాలవేఁగాదగుస్వీయకార్యములఁ జేయక చిక్కులుపెట్టుదురని వా
రి నడుగుమనివీరుసువీరినడుగుమని వారునుజివరకుపహాతాశునింజేసిరి. ఇట్లుదుర్ఘటకార్యము
లకాసించి యితరవర్ణముల ఁజేమవొచ్చు నంతటియవకాశమేని గానక చివరకుగతవ
త్సరమున నాయూరి విష్ణ్వాలయమున బొల్లాపల్లి వెంకటప్పయ్యగారుజేయిం
చినధ్వజప్రతిష్ఠలో నేదియోకొంత జోక్యము పుచ్చుకొనఁబోవ నచ్చటియాజకుఁ
డగు వైష్ణవబ్రాహ్మణుఁడు తలజూపనీయక పోయెను. అందుపైనాయాచార్యులుగారి
పరోక్షముననేక దుర్భాషలువచించి తమకును బ్రతిష్ఠచేయించు నధికారమున్నదని తే
ల్చుకొని వెక్కటయ్య ప్రభృతులు వీరభద్రాలయములోఁ బట్టుపట్టుమని యొకధ్వజప్రతి
ష్ఠంజేసిరి. అప్పుడాయూరిలౌక్యభూసురులు కొందఱిది యనర్థమని నిరోధించినను వి
నకందున నిదివఱకే మాయూరజరిగిన గ్రామదేవతా సంప్రోక్షణమును గూర్చి వీరికిఁబ్ర
తిష్ఠజేయునధికారములేదు కాఁబట్టిపునస్సంప్రోక్షణ సలిపింపుఁడని నేనున్యాయాధి

కారుల ప్రోల వ్యాజ్యము దాఖల్ చేసియుంటిరి గావున మరల మన మేల వ్యవహారమునకు దిగవలె దీననే తేలునుగదా! యనితలఁచి నన్ను బిలిపించి యాయూరి వైదిక నియోగులును వైశ్యులును గొంతచందాపత్రాలు చేసి యిచ్చిరి. అప్పట్లు నాకాయూర తెలిసిన మాదిరి సమాచారమంతయు వివరించితి. అందు "నప్రతిష్ఠాసమారి వృః" అను ధర్మశాస్త్ర వచనము నుదాహరించి విధివిహీనముగఁ జేసిన ప్రతిష్ఠలవలన ననర్థములు వాటిల్లునని చెప్పుచు నప్రతిష్ఠలో యాజమానము వహించిన కాకుమానుగురులింగము కుమారుఁడు మూఁడవదినమున నేమృతుఁడగుటం దృష్టాంతముచూపించితి, అది కారణముచేసికొని మరల నీసంవత్సర మాయూరికి నేను బోఁగా మాపేరులు పేపరులో నెత్తి మాపిల్లవాఁడు చచ్చినది వ్రాసితివి. కావున నీకులమెక్కువదో మాకులమెక్కువదో సభచేసి తెలుపుమండుమని నన్నుఁజూచినతోడనే గురులింగమును చెట్టియ్యయుండ గాదాకుసిద్ధమయిరి, అందుకు నేను వీరపండితులు కావున సభార్హులు కారనియు నీసభయందున్న మంగళగిరిలో నల్లయాచార్యులుగారికిని లక్ష్మీకాంతమునకును నైన సభవలెనే తేలుననియుఁ గొంతవఱకు స్పష్టపడక మీరు మేము సభయనికూర్చుండి యొకరితర్వాత మఱియొక్కరు మాట్లాడుటకును సభ్యేతరప్రసంగము చేయకుండుటకును నియామకులు కొందఱు నుండవలెననియు, నుభయుల వాదములను సమంజసము చేసికొని జయాపజయముల నిర్దేశించు పెద్దమానుషులు కావలెననియుఁ జెప్పి కొంతకాలము జరిపితి ఆమాటఁ జెవిని బెట్టక నేనెటుపోతే నట్లెల్లవచ్చి తమ చిత్తూరుజిల్లాతీర్పువిప్పి యందలి బూఁతులపంచాంగము బైటబెట్టుచుండుటయు దూరాలోచనలేని యాయూరి పెద్దమనుష్యులు కొందఱు వీరప్పడప్పకు మేమే బ్రాహ్మణులమనియు బ్రాహ్మణులు బ్రాహ్మణులు కారనియు నవ్వియోపిచ్చిప్రసంగములు చేయుచుండుటచే నాతోఁ దారసిలఁబెట్టి తదపజయముం గాంచవలెనని నన్నుం బ్రోత్సాహపఱచిరి. అందుకు నేనును విధిలేక యొప్పుకొని మొదటిపూర్వపక్షమిది యేకదాయని మేము బ్రాహ్మణులమనియు మీరువిశ్వబ్రాహ్మణులు కారనియు శ్రుతిస్మృతిపురాణేతిహాసాచారములచే నిర్దేశింతునని వ్రాసిచ్చినమీఁద నదివఱకు సభసభయని వెంటఁబడిన చెట్టియ్య చెట్టియ్యయేయి మరల మాపండితుల మఱికొందఱిఁ బిలుపించి కొందునుగాన నొకవాయిదా విధింపవలసినదని కోరెను. ఈవాయిదాలు వేసికొనుచు మీఁతోఁబోట్లాడుచు కూర్చుండుటకు నాకుఁదీరదుగాన గుంటూరులో విమర్శింపఁబడనున్న వ్యాజ్యము వాయిదా 21—8—11 ఐయున్నది. యానాఁడచటికి వచ్చినచో నుభయపక్షముల పండితులు నువత్తురు గావున నచ్చటనే గావచ్చునని చె

స్థితి. అందుకు నీచటనైనఁగాని తమనోటికివచ్చినట్లెల్ల బ్రేలుటకు వీలులేదని గుంటూరులోనైనచో మాయూరివారందఱుంజూచి సంతోషించుటకు సందర్భపడదు కావున నిచ్చటే కావలెనని నిర్బంధపెట్టసాఁగెను.

ఇదియిట్లుండ గురులింగమైతే నిప్పుడే సభకావలెనని చిత్తూరుజిల్లాతీర్పు విన్నము నీఋషియుట్లుపుట్టినునాఋషి. యట్లుపుట్టినుఁలోనుగాఁగలయవాచ్యప్రసంగములు చేయదొరకొనుటయునందుకు వైట్రియ్యకూడ సమ్మతించి తననోరును చౌఁబవేసికొనుటయు సంభవించిరసాభాసకు హేతువైనది. ఇఁక నీసభకు నేనుండవలసినయవసరము లేదుకదా? యనియాయూరి పెద్దమనుష్యులనడిగి యచటినుండి నేనుదొలఁగుటయు (దత్రీశ్యులగు భూసురడింభకులుపలుమంది చేరిరథకారులతోఁబ్రఘనమునకు సిద్ధమయినమీఁదఁదము తమయావేశములుతగ్గించుకొని స్వస్థలములం బ్రవేశించిరి.

ఇంతియేకాక యిదియేమిచిష్కాలమో యేమో ? యీజాతిజనులు ప్రతిగ్రామమందున లేనిపోని మామూళ్ళు మొదలుపెట్టి కడుగడబిడలు చేయుచున్నవారను- ప్రత్తిపాటికి సమీపమున నేయున్న గొట్టిపాటియం నూతనముగా రథ ప్రతిష్ఠయొకటి జరిగియుండెను. ఆనాఁడు స్వామిని రథముపై వేంచేయింపఁజేసి యుత్సవము సలుపుతటి వీరు మనము రథకారుల మేకదా యని రథముపై కెక్కి దిగకయుండిరఁట. వంచిమాటలచే దిగకపోయినమీఁద గ్రామయజమానులు జుట్టుపట్టి క్రిందికీలాగుటయు నంతట వీరందఱును మొత్తమై చప్పాలుతీసికొని వెళ్ళిపోయెడి సమయమునకు గ్రామస్థులు చప్పాలుమాత్రము వదలిపెట్టిపొండని చెప్పిరఁట-చప్పాలు మేము చేసినవి కాన మేము తీసికొని పోయెదమని రథకారులనిరఁట. అందుకందఱును రథమును మీరు చేసినదే కావున నదియుఁదీసికొని పోవలసినదేకదా ? యని జవాబు చెప్పచు "మా సామానును గూలితీసికొని చెక్కియమర్చినంతనే మీదియెట్లగు"? నని చప్పాలూడఁదీసికొని పంపించి యాపనులు నేర్చిన మఱికొందరిచే రథమును నడిపింపఁజేసి యవ్యాహతముగా నుత్సవముఁ ముగించిరఁట- బ్రాహ్మణబాలకుల కుపనయనములో దీక్షావేదికయందే సర్వసంస్కారములతోపాటు చౌలసంస్కారమును వపనసంస్కారమును జరిగిన యనంతర మివతలనొక పీఠిపై వటువుగూర్చుండఁ గంసాలి పోగులు కట్టుటయు మంగలి క్షౌరము చేయుటయు ననాదిసిద్ధమైన మర్యాదగా వచ్చుచున్నది- అట్టిదానికి మనవారు వేదికలో నాచార్యుఁడుగూర్చుండిన పీటమీఁదనే తాముకూర్చుండిపోగులుకట్టవలెనన్న పెనఁగొకటి పెట్టుకొనిరి, ఇట్టికానిపోని పెనఁగులాటలు పెట్టుకొనుటయే కాని యెట్లో తమపనులు సప్లైయి చేసికొని జనులు వీరికి లోఁగకయేయుండురు-

## ఈ నెలసొమ్ము చెల్లించిన చందాదార్లు

1 ముత్తరాజు వెంకటరమణయ్యగారు, మునేరు సబ్ డివిజనాఫీసు హెడ్ క్లర్కు, బెజవాడ.

2 జినుగు కుశలవరామయ్యగారు, కరణం, పెదగార్లపాడు.

3 పసుచూరి చినకోటయ్యగారు, వండమూడి.

4 సుద్రవరం హనుమంతరావుగారు, కొలకలూరు.

5 పిల్లుట్ల వెంకటప్పయ్యగారు, తాలూకాక్లర్కు, అవనిగడ్డ.

6 తాడేపల్లి లక్ష్మీనారాయణగారు, రామచంద్రపురం.

7 పుతుంబాక సీతారామయ్యగారు, పెదపాలెం.

8 పోలవరం రామచంద్రయ్యగారు, కొలకలూరు.

9 నంగన కేశవభుట్లుగారు, జగ్గాపురం.

10 వారణాసి విశ్వనాథశాస్త్రిగారు, యర్రగుండపాలెం.

11 గుర్రం పేరారెడ్డిగారు, గ్రామమునసబ్, పిల్లుట్ల.

12 అక్కిరాజు శ్రీశైలంగారు, డిటో, రామాపురం.

13 సన్నిధానం విశ్వనాథశాస్త్రిగారు, చౌటపాపయ్యపాలెం.

14 రాజనాల వేదాద్రిశాస్త్రిగారు, ప్రత్తిపాడు.

15 పాకాల జగన్నాథంగారు, మల్లాయపాలెం.

16 యామర్తి బొల్లయ్యగారు, కరణం, గొట్టిపాడు.

17 నాదెండ్ల రామచంద్రయ్యగారు, డిటో.

18 ఏకా భుజంగరావుగారు, డిటో.

19 ఇయ్యూణ్ణి అనంతపద్మనాభదేశికాచార్యులుగారు, వెంకట్రాముని మోరి వాణిపేట.

20 చిన్నకోట వెంకటరత్నయ్యగారు, బి. వి. ప్రెస్, నర్సరావుపేట.

కం॥ ఎదురుగనిల్చిశతఘ్నికి, బెదరక శ్రీచెళ్లపిళ్ల వెంకటకవితా।
వదలెను బాణపతంబును, బదిలముగా నుండుండింక బాలకవీశుల్!॥

శ్లో॥ ఏకమప్యక్షరంయస్తుగురుశ్శిష్యేనివేదయేత్, పృథివ్యాంనాస్తియద్ద్రవ్యంయద్దత్వా
హ్యనృణీభవేత్। ఏకాక్షరప్రదాతారంయోగురుంనాభిమన్యతే, శునాంయోని
శతంగత్వాచాండాలేష్వపిజాయతే॥ అత్రిసంహిత.

కంసాలులమీఁదఁ దేఁబడిన దావా గుంటూరు డివిషనల్ కోర్టులో 21-6-11 తేదీని దప్పకవిచారణజరుగును గావున మతాభిమానముగల సకలజనులును నప్పటికి దప్పక విచ్చేయుటకుఁ బ్రార్థితులు.

ప్రధానపోషకులు

శ్రీ శ్రీ జగద్గురు విరూపాక్షస్వాములవారు.

ఈ సంవత్సరము చందాయిచ్చిన—

పోషకులు.

1 తాడేపల్లి లక్ష్మీనరసింహారావుగారు, మద్రాసు, కాలేజ్.
2 రంగావఝల హనుమయ్యగారు, జిల్లా కోర్టు వకీలు, గుంటూరు.
3 ప్రత్తిపాటి బ్రాహ్మణులు, వైశ్యులు.

ఇవ్వవలసినవారు—

4 పులిపాక పూర్ణయ్య పంతులుగారు, వకీలు, నర్సరావుపేట.
5 తిప్పరాజు కామేశ్వరరావుగారు, కరణం, దుగ్గిరాల.
6 రామసింగుగారు, నెల్లూరు.
7 పోలేపల్లి రాజేశ్వరరావు, దేశముఖుగారు, పెద్దపల్లి.
8 దేవరాజు మురళీధరరావుగారు, వ్రాదెల.

అభినవసరస్వతి కార్యస్థానమున వెలకు దొరకు పుస్తకములు.

1. అళ్లయాచార్య విజయము. ... ... ... 0—4—0
2. కరిణీకోద్ధారిణి. (పూరి వీరభద్రకవి) ... ... 0—4—0
3. వాసంతికా పరిణయము. } ఇవి 2 నాటకములు. ... 0—4—0
4. కంసవధము, ... 0—8—0
5. చమత్కారమంజరి. (సింహాద్రి వెంకటాచార్యులు) ... 0—4—6
6. గురుపరంపర. ... ... ... ... 0—2—0
7. నీతిగీతులు. (సుమతిశతకమునకు సంస్కృతము.) ... 0—2—0
8. వత్సల నీతిశతకము. (కొండముది నరసింహము.) ... 0—1—6
9. విశ్వబ్రాహ్మణ శబ్దఖండనము. ... ... ... 0—1—6
10. అత్యద్భుత విమర్శనము. (మం॥ కృష్ణద్వైపాయనాచార్యులు.) ఇది వెంకటరామకృష్ణకవుల యవధానములపై విమర్శనము. } 0—5—0

వలయువారలు సొమ్ము పంపిగాని వి.పి. ద్వారాగాని ఈ క్రింది వారికి వ్రాసి తెప్పించుకొనవచ్చును.

 జానపాటి పురుషోత్తం.

సబ్ ఎడిటర్, జానపాడు.

పిడుగురాళ్ళపోష్టు, గుంటూరుజిల్లా.

